# కిరణాలు - కెరటాలు

## కవితా ముక్తకాలు

తిరుమల శ్రీనివాసాచార్య

ప్రచురణ




రిజిష్టర్డు నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

**KIRANALU – KERATALU**

**POETIC THOUGHTS**

By : *Tirumala Srinivasacharya*



**యువభారతి**

ప్రచురణ : 53

ప్రథమ ముద్రణ : ప్రతులు 2,200

2 జనవరి, 1977

ముఖ చిత్ర రచన ; అక్షరాలంకారణ :

**శీలా వీర్రాజు**

ముద్రణ :

నాగలక్ష్మి ఆర్టు ప్రింటర్సు, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :

టెక్నో ప్రింటర్స్ - హైదరాబాదు.

**యువభారతి**

ప్రతులకు :

5, కింగ్స్‌వే; సికింద్రాబాదు-500 003.

వెల : 2-00

---

Paper used for the Printing of these books was made available by the Government of India at Concessional rate.

YUVABHARATHI IS GRATEFUL



# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మకశక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పన్నెండేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటే ఇతరమైన సాత్వికసాధనంలేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమసాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇది యువభారతి 53 వ ప్రచురణ. ఇంతవరకు రెండులక్షల ఏభై వేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు పాఠకులకు అందించడానికి పూనుకొంది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో దాదాపు 4,500 మందికి పైగా సాహితీమిత్రులు చేరారు. రానున్న ఉగాదినాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్యసాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వతజీవిత సభ్యత్వ పథకాలలో ఆరువందల మందికి పైగా భారతీమిత్రులుగా, యాభై మంది భారతీభూషణులుగా చేరారు. ఏ ఒక్క పథకంలోనైనా సభ్యులుగాచేరి మా 'నందిని" మాసపత్రికను ఉచితంగా పొందే అవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. 'నందిని'లో యువభారతి కార్యకలాపాల వివరాలేకాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి.

మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

2-1-1977.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

# మా మా ట

తలపులకు మలుపులనేకం. కవుల తీరులనేకం తలపులకు వన్నెచిన్నె లెన్నెన్నో! కొందరు కవుల కొన్ని భావాలు ఎల్లలను ఎరుగవు. జగత్తులోని ఏ వస్తువునైనా సరే మనముందుకు తీసుకొనివస్తాయి. స్వప్నలోకాన్ని కూడా మన కన్నుల ముందుకు తెస్తాయి. కొందరు కవుల భావాలు అనుభూతులకు శబ్దాకృతులే. కొందరు కవుల భావ శబలత కంటె శబ్దాల సౌందర్యం శ్రవణ సుఖాన్ని కలిగిస్తుంది. కొందరు కవుల భావాలు పఠితల ఆలోచనాధీనులను చేస్తాయి. తాము దిఙ్మాత్రంగా చెప్పి మిగిలిన దానిని పాఠకుల సంస్కారానికే వదిలి వేస్తారు. ఇచ్చవచ్చిన వ్యాఖ్యానం చేసుకునే అవకాశం కల్పిస్తారు. అలతి యలతి పలుకులకు ఛందోమర్యాదలు కైసేసి ముక్తక మౌక్తికాలను విర జిమ్ముతారు. ఎప్పుడు ఏ మాట కవికి తోచినా, అందంగా, క్లుప్తంగా దానిని చెప్పడమే సూక్తి అనిపించుకుంటుంది. కావ్యం సంగతి వేరు. అందులో వస్తు, రస, అలంకారాది ఔచిత్యాల నెన్నింటినో పోషింపవలసి వస్తుంది. చిన్నమాటలో ఒక్కొకసారి కవి స్వీయానుభవం తొంగిచూస్తుంది. ఒక్కొక్కసారి లోక వ్యవహారంలోని ప్రతారణాన్ని వ్యంజిస్తుంది. ఒక్కొక్కసారి మానవతా మర్యాదలను ఎత్తి చూపుతుంది. ఒక్కొకసారి మాట బొమ్మలను మనముందు ఆడిస్తుంది. కవితాత్మ తళుక్కుమని మెరిసినట్లుంటుంది ఒక్కొకసారి.

శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యుల ఈ సూక్తులు సమాజంలోని ఏదో ఒక అంశాన్ని ముందుంచుకొని ఝటితి స్ఫూర్తిగా వ్యంగ్యంగా చెప్పినవి. ఈయన ఇప్పటికే రెండు గేయ సంకలనాలను, అనేక కావ్య పరిచయాత్మక వ్యాసాలను ప్రముఖ పత్రికల్లో ప్రచురించారు. మరో కవితా సంపుటి ప్రచురణకు సిద్ధంగా ఉంది. మహాకవి డా. సి. నారాయణరెడ్డి రచనలను సమీక్షిస్తూ ఒక బృహద్గ్రంథాన్ని వ్రాసి ప్రచురించే ఏర్పాట్లు చేసుకుంటున్నారు. శ్రీ తిరుమల మంచివక్తలు. ఉత్తమ అధ్యాపకులు సర్దార్ పటేల్ కాలేజిలో ఆంధ్రోపన్యాసకులు. తెలుగులో గేయ నాటికల'ను గూర్చి పరిశోధన చేస్తున్నారు. మా 'యువభారతి'కి ఉపాధ్యక్షులు. యువభారతి నిర్వహిస్తున్న కార్యక్రమాల విజయానికి తమ ప్రతిభా సామర్థ్యాలను అందిస్తూనే, కాగలిగిన మేరకు ఆర్థిక సహకారాన్ని అందిస్తున్న ఉదారులు. తమ ఈ సూక్తులను ప్రచురించే అవకాశాన్ని యువభారతికి కలిగించిన శ్రీ ఆచార్యులవారిని అభినందిస్తున్నాము.

2-1-1977

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు

# నిమిషంలో నిగ్గు

'నేను వ్రాసే ప్రతి ఖండానికీ
నికషోపలం ఏమిటి ?
నిజాన్ని ఎంత అందంగా
నిరూపిస్తాననే దొకటి!

నిజాన్ని అందంగా దాస్తే వర్ణన, అందంగా నిరూపిస్తే సూక్తి. రెండూ కవితకు చూపులే. మిత్రులు శ్రీనివాసాచార్యులుగారికి రెండింటినీ చూచే సమదృష్టి సహజంగా ఉంది. నాకు వీరితో పదేళ్లబట్టి పరిచయం. సరదాగా కలిసి తిరిగే టప్పుడు గూడా సాహిత్యం మాట్లాడే సహృదయుడు. మనసులో మసలిన ప్రతి భావాన్నీ చికిలిపెట్టి చిత్రించాలనే చికీర్ష అనుక్షణం ఆయన కన్నుల్లో కనపడు తుంది. తిరుమల శ్రీనివాసాచార్యులు మూడు కవితాగుణాల త్రివేణీ సంగమం. ఒకటి: అవధానం రెండు: ఆశూక్తి మూడు: అంత్యప్రాస. చదివిన పద్యాన్ని చప్పున నాల్కమీద కెక్కించుకొనే చాకచక్యముంది వీరికి. ఆచార్య దివాకర్ల వేంకటావధాని శిష్యులు వీరు. మొదటి కావ్య సంపుటిని వారికే అంకితమిచ్చారు. ఆశూక్తి ఈయన రక్తగతమైన కవితాశక్తి. మిత్రులతో కలిసి అడుగులు వేస్తూనే మెరుపుల్లాంటి కవితాత్మక వాక్యాలను రవ్వల్లా గుప్పిస్తుంటారు. అక్ష రచ్ఛందస్సు కంటె మాత్రాచ్ఛందస్సే ఆచార్యులవారి మనస్సుకు దగ్గరి చుట్టం. గొంతెత్తి కవితనందుకుంటే చాలు గురు లఘువులు కుదురుగా వచ్చి వాక్యగతిలో వరుసగా నించుంటాయి. దేశిచ్ఛందాల్లో ఆశుకవిత్వం చెప్పే కవితాత్మ కారణ జన్మ మెత్తినట్లు కనిపిస్తాడు మిత్రుడు తిరుమల. కవితకు ఆవిష్కృతిలో అలంకారం అతిసహజం. అర్థాలంకారం అందగిస్తున్నా అంత్యప్రాస ముందడుగు వేస్తుంది ఆచార్యులవారి కవితతో. యతిప్రాసల్లో కంటె అంత్యప్రాసలో ఒక అందం ఉంది. యతిప్రాసలు గతిలోని నియతిని జ్ఞప్తికి తెస్తాయి. అంత్య ప్రాసలు కాలిగజ్జెల సవ్వడిని జ్ఞప్తికి తెస్తాయి. పద్యంలో ఒకటి రాణిస్తే, పాటలో మరొక్కటి రాణిస్తుంది. పద్యానికి నడక ప్రధానం, పాటకు ఆట

4



ప్రధానం. మాత్రాచ్ఛందస్సులో నడిచే రచన లాస్యం చేసినట్లుండాలి. అందులో సూక్తుల్లాంటి ముక్తకాలు వ్రాస్తే చూట్టానికి కెరటాలుగా ఉంటాయి. కెరటానికి ఉత్పత్తి గాలితాకిడి. ఉత్పత్తి అయితేచాలు ఉవ్వెత్తుగా లేస్తుంది. ఆ లేవటంలో ఎన్నో హొయలుపోతుంది. పెరిగిన కెరటం విరుగుతుంది. విరుపులో కూడా వేయి హొయలుపోతుంది. కవితల్లో కెరటాలను సృష్టించారు శ్రీనివాసాచార్యులుగారు. "వానకు తడిస్తేనే- దాని గొప్పతనం- కవితకు కదిలితేనే- కావ్యం గొప్పతనం" అన్నారాయన. కవితకున్న కదిలించే గుణానికి కెరటాన్ని ప్రతీకగా భావించి పేరు పెట్టారనుకుంటాను.

అనుభూతినుండి ఆలోచన పుడుతుంది కవికి. ఆలోచననుండి అనుభూతి కలుగుతుంది శ్రోతకు. అనుభూతి అనంతకాంతిపుంజం వంటిది. అందులో ఒక కిరణం కవితలో ఒక చరణంగా ప్రసరిస్తుంది. అనుభూతియొక్క అక్షరావిష్కారం కిరణం. ఇందులో కవితలన్నీ కిరణాలే. కిరణాలు కెరటాలమీద పడినప్పుడు మిలమిలలాడే వెలుగు కనిపిస్తుంది. అది ప్రవాహంలో అందంగా దర్శనమిస్తుంది. ఆచార్యులవారి కవిత్వం కూడా గంగాతరంగిణిలా సాగిపోతుంది.

"ఈ కవితా గంగానది
ఎంతవరకు ప్రవహించును
మనిషిగుండె పొలంలోన
మణులను పండించువరకు''

కవిగుండె పొలంలో పండిన మణులే ఈ ముక్తకాల మౌక్తికాలు. వీటిని చదువుతుంటే వేమన్న సూక్తుల వేడి కనబడదు; విస్సన్న సూక్తుల వింత కనబడదు. మనిషి మనసును ముకురంలో చూచుకునే సొగసు కనపడుతుంది. అనుభూతివాది మాట్లాడితే అలాగే ఉంటుంది. "లోచనం కన్న ఆలోచనం ప్రధానం - అందాల శబ్దాలకన్న అంతరాత్మ ప్రధానం'' అనే ఆచార్యులు అనుభూతివాదులు. అందువల్లనే "కన్నీళ్ళంటే తెలియనివాడికి - కవిత్వం ఎలా తెలుస్తుంది?" అని అడుగుతారు భవభూతిలా.

అనుభూతిని కృతిగా ఆవిష్కరించటానికి ఆకృతి కావాలి. విశిష్టపద సంవిధానంతో ఆకృతివస్తుంది. "బట్ట అందమంతా కట్టడంలోనే- శరీరసౌందర్యమంతా సౌష్ఠవంలోనే- భాష అందమంతా పదాల పొందికలోనే-" శబ్దాన్ని వశం

చేసుకున్నవాడు సమర్థుడు, అర్థాన్ని వశంచేసుకున్నవాడు సిద్ధుడు. సామర్థ్యం ఉంటేనే సిద్ధావస్థ కలిగేది. 'సాధనచేసే మనిషి సాధించని దేమున్నది ?' 'ఖడ్గ శక్తి మెరిస్తే కదనం, శబ్దశక్తి విరిస్తే కవనం'- అని తమ సామర్థ్యాన్ని ప్రకటించారు ఆచార్యులగారు.

లోచూపు సహజంగా ఉన్న ఆచార్యులవారికి లోకంపోకడను చూచే సూక్ష్మేక్షిక ఉంది. "ఈ లోకంలో- గెలువవలసిన న్యాయాలకంటె- గెలువని న్యాయాలే ఎక్కువ- స్టేజీలదగ్గర- ఆగవలసిన బస్సులకంటె- ఆగని బస్సులే ఎక్కువ'. 'ప్రతిఊరికీ ప్రధానమంత్రి వస్తే- పరిశుభ్రత కేం లోటుంటుంది'- వంటివి నిజాన్ని అందంగా నిరూపించే కవితలే. "పనిచేసే మనిషికి పరిస్థితు లేవైతేనేం ?" "వ్రాసే ప్రతిభకు వస్తువేదైతేనేం"- అన్నట్లు ఏ వస్తువును తీసుకున్నా ఆచార్యులవారు అందాన్నీ, అనుభూతినీ ఆవిష్కరించగలరు.

'మహాకవిత్వం కన్న
మానవత్వం మిన్న'

మానవత్వం వీరి కవితకు దృక్పథం ! మహాకవిత్వం వీరు సాధించే దివ్యపథం!

'గంటసేపు రసపరవశుడై
కవితను కవి వ్రాసేస్తే
నిమిషంలోనే విమర్శకుడు
నిగ్గుతేల్చి పారేస్తాడు'

అన్న ఖండిక చదివింతరువాత నన్ను నేనే పరామర్శించుకొని ఆచార్యులవారిని అభినందించి ముందుమాట ముగిస్తున్నాను.

జి. వి. సుబ్రహ్మణ్యం.

# నా మాట

భిన్నభిన్న సమయాల్లో నా శిరసులో మెరిసిన ఉక్తులివి. ఎన్నెన్నో ప్రదేశాల్లో ఉన్నప్పుడు ఎదనుండి ఎగిసిన ముక్తకాలివి. ఇవి నా భావాలూ అనుభవాలూ. కొన్ని భావాలు కిరణాల్లాంటివైతే మరికొన్ని కెరటాల్లాంటివి.

'మూడు'ను బట్టి సాగిన ఈ ముక్తకాలలో మూడూ ఉన్నాయి—గేయం పద్యం వచనం. శబ్దార్థ సౌష్ఠవంతోపాటు కవితాసౌగంధ్యాన్నీ ఛందస్సౌందర్యాన్నీ సంక్షిప్తతనూ సాధించడానికి శక్తికొలది యత్నించాను వీని రచనలో.

ఈ ముక్తకాలలో కొన్ని అగుపిస్తున్న సమాజస్థితిగతులకు అద్దం పట్టితే మరికొన్ని మనం సాధించవలసిన ప్రగతికి సంకేతాలుగా నిలుస్తాయి. కొన్ని ప్రకృతితత్త్వాన్ని ప్రపంచిస్తే మరికొన్ని భావనాజగత్తుకు బాటలు వేస్తాయి.

కవిత్వం ఆరిపోని ఒక అగ్నిజ్వాల అయితే అందులోనుండి ఎగిసివచ్చే నిప్పు రవ్వల్లాంటివి ఈ ముక్తకాలు. చెదరిన ఈ రవ్వల్లో నా కవితా హృదయం అంతా అగుపించే అవకాశం లేదు. అందువల్లనే మరో కవితా సంపుటిని త్వరలో వెలువరించాలనుకుంటున్నాను. కవితా సంపుటి ఒక సజీవ స్రవంతి. అందులోని కెరటాలు వానిపైని కిరణాలు ఈ ముక్తకాలు.

ఈ సంపుటిని ప్రచురిస్తున్న యువభారతికి కృతజ్ఞుణ్ణి. నా రచన ఈ రూపంలో రావడానికి నాకు బహువిధాలుగా ప్రోత్సాహాన్నీ సహకారాన్నీ అందించిన సహృదయులు ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారికీ డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారికీ డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికీ శ్రీ వంగపల్లి విశ్వనాథం గారికీ శ్రీ ఎస్. వెంకటేశ్వరరావు గారికీ నా అభివందనాలు. ముఖపత్రాన్ని అందంగా అలంకరించిన మిత్రులూ చిత్రకారులూ శ్రీ శీలా వీర్రాజుగారికి నా ధన్యవాదాలు. ఇంకా అడుగడుగునా సాయపడిన నా తోడి యువభారతీయులందరికీ నా కృతజ్ఞతలు.

సహృదయులు ఈ గ్రంథాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు

**తిరుమల శ్రీనివాసాచార్య**

# కిరణాలు - కెరటాలు

1

కమ్మని స్నేహం బంగరు నాణెం
బొమ్మా బొరుసూ రెండు సమానం.

2

మంచికి శిఖరంలా
నిలవాలి నీ శిరస్సు
మమతకు ముకురంలా
మెరవాలి నీ మనస్సు.

3

పల్లె ముగ్ధ
పట్నం ప్రౌఢ.

4

లోచనం కన్న
ఆలోచనం ప్రధానం
అందాల శబ్దాలకన్న
అంతరాత్మ ప్రధానం.

5

కిరణం మాట్లాడే
తరుణం వస్తున్నది
సౌరభం కనిపించే
సమయం వస్తున్నది.

6

శక్తి పెంచుకున్ననాడే
సంఘం నిను పిలుస్తుంది
రక్తి పెంచుకున్ననాడే
రసలోకం నిలుస్తుంది.

7

పగవాడూ
భగవానుడూ
పసివాడిముందు బలాదూరు
అందుకే వాణ్ణిచూచి
అందరూ కరిగిపోతారు.

8

ధరిత్రిలో పుట్టిన వాళ్లల్లో
చరిత్రకెక్కేవాళ్లు ఎందరు?
చరిత్రకెక్కినవాళ్ళల్లోనూ
సచ్చరిత్రులు ఎందరు?

9

'టెక్స్టు బుక్కుల'కన్న ముందే
'గైడ్లు' కనిపిస్తాయి.
విజ్ఞానం కన్న వేగంగా
వ్యాపారం వ్యాపిస్తుంది.

10

నిన్నువాడుకునే వారంతా
నీకు తోడు నిలిచేరా!
పూలు తెంపుకునే వాళ్లంతా
నీళ్లుపోసే వాళ్లేనా!

11

చెట్టు పచ్చగుంటేనే పూలూ పళ్లూ
మనిషి మంచిగుంటేనే కైతలు కళలూ.

12

సంద్రాన్ని చూశాను
సాహిత్యం కనిపించింది.
చంద్రుణ్ణి చూశాను
సంగీతం వినిపించింది.

13

సోమరితనాన్ని తొక్కేవాడే
సోపానాలెక్కేవాడు
సోపానా లెక్కేవాడే
సోమునిపై ఎక్కేవాడు.

14

సత్యం మాట్లాడడంకంటె
సాహసమేముంది?

15

పారిజాతమూ
బంతిపువ్వూ
ప్రకృతి దృష్టిలో సమానం
రవ్వలా ఉన్నా
గవ్వలా ఉన్నా
అవ్వకు బిడ్డలంటే ప్రాణం
చురచుర చూసే సూర్యుడూ
చల్లని చేతుల చంద్రుడూ
బిక్కు బిక్కుమను చుక్కలు
ఆకాశానికి అందరు ఒకటే.

16

ఆడదానికి మగవేషం
అదో విలాసం.
ఆడవేషం మగవాడికి
అదేం లక్షణం !

17

క్షేత్రంలో తడి ఉంటే
చెట్టు మొలుస్తుంది.
చిత్తంలో తడి ఉంటే
కవిత వెలుస్తుంది.

18

కోటి విద్యలు నేర్చేదీ
గుండెను మథించేదీ
గొడ్డలిలా నరకడానికికాదు
కుసుమంలా విరబూయడానికి.

19

తనదేనని అనుకుంటే
తగాదాలు హెచ్చు
నిన్ను నీవు మరిస్తే
ఎన్నో పనులు చేయొచ్చు.

20

సాధించేటంత వరకు
సంఘానికి తెలుపకు.
సాధించిన మరు క్షణం
సంఘమ్మును మరువకు.

21

మంచిని సాధించనివాడు
మరణించిన వాడే
చెడును ఎదిరించనివాడు
జడునికి సైదోడే.

22

సంఘానికి సేవచేయు
జాతకం ఏ కొందరికో
జనహృదయాల్లో వెల్గే
చరితం ఆ కొందరికే.

23

లోకజ్ఞత లేని ప్రతిభ
రాణించుట కష్టం
ప్రతిభాలోకజ్ఞతలకు
జత కుదురుట అదృష్టం:

24

అందరినీ తృప్తి పరచు
టన్నది దుష్కరమౌ కృషి
ఉన్న ఒక్క హృదయంతో
ఎన్నని చేస్తాడు మనిషి?

25

ప్రతి జాతికీ ఒక చరిత్ర
పాఠం చెప్పిందేమని?
నీకాలం కళాత్ములను
నిర్లక్ష్యం చేయొద్దని.

26

కన్నీళ్ళంటే తెలియని వాడికి
కవిత్వం ఎలా తెలుస్తుంది?

27

పట్టాలపై పోని రైలు
కట్టుబాటు లేని బ్రతుకు
గమ్యాన్ని చేరలేదు
రమ్యతను చేర్చుకోదు.

28

'ఇంకు' ఏదైతేనేం?
అంకెలు వేయడానికి.
మనిషి ఎవడైతేనేం?
మంచి చేయడానికి.

29

పనిచేసే మనిషికి
పరిస్థితులేవైతేనేం?
వ్రాసే ప్రతిభకు
వస్తువేదైతేనేం?

30

మనిషికూడా ఈనాటి
మహానగరంలా మారితే
శాంతి-అమావాస్యనాటి చంద్రకాంతి
సుఖం-స్వప్నసుందరి ముఖం

31

గుడ్డివాడు ఎప్పుడోకాని
అడ్డంపడడు
కళ్ళున్నవాడే ఎప్పుడూ
కాలుజారి పడతాడు.

32

పాలిచ్చే తల్లి వైపు
ఏ పాపీ చూడదు
ఒయ్యారం ఒలికిస్తేనే
వెయ్యికళ్ళు చూస్తాయి.

33

కావ్యాలెందుకు?
కన్నీళ్ళు తుడువడానికి.
చదువులెందుకు?
సక్రమంగా నడవడానికి.

34

గట్టిగా నిలద్రొక్కుకొనగా
కట్టుదిట్టాలెన్నో చేసితి
కాని-మంచి సమయానికి-నే
కరిగి కాల్వై పరుగులెత్తితి.

35

ప్రతిఫలమ్ము కోరనిచో
ప్రతి మనిషీ మహాత్ముడే
భయం విడిచి పెట్టనిచో
ప్రతివాడూ సామాన్యుడే.

36

కరిగిపోయే జాలి గుండెకు
గాయములె మిగులును ఫలంగా
అని తెలిసీ అదే చిత్రం
అలేపోవు మనసు బలంగా

37

విద్యుత్తంటూ ఉంటే
వెయ్యి పనులు చేయొచ్చు
శక్తి అనే దొకటుంటే
స్వర్గం నిర్మించొచ్చు.

38

ఎక్కే వాళ్ళ కులగోత్రాలను
ఎప్పుడైనా అడిగేనా రైలు?
సౌరభాలలో తేలేవాళ్ళను
పేరేమని అడిగేనా పూలు?

39

దేశంకోసం బ్రతికే వాళ్ళకు
లేశమైన కనిపించునె గర్వం!
ప్రాణికోటికై జీవనమొసగే
ప్రవాహమున కుండునె దర్పం!

40

వన్నె చిన్నెలూ-వ్రాతలో ఉండాలికాని
పెన్నులో కాదు-పెన్సిల్లో కాదు.

41

ఎన్నికైన ఎంకయ్యలందరు
ఎందుకవుతారు నాయకులు!
సరిగమలను నేర్చిన మాత్రానవె
స్వరమాధురి కురిసెదరె గాయకులు!

42

డబ్బాపాలు పోస్తుంటే మరి
అబ్బునె పిల్లకు తల్లిగుణాలు?

43

ఎప్పుడూ ప్రపంచంలో
ఎక్కడో ఒక చోట
మల్లెలు పూస్తుంటాయి
మంటలు లేస్తుంటాయి.

44

అక్షరాలు వచ్చినప్పటి ఆనందం
ఆస్తులు తెచ్చుకున్నప్పుడు రాదు.

45

చచ్చేది తాను కాకుంటే చాలు
లక్షయుద్ధాలు ప్రకటించొచ్చు
వచ్చేది తనకైతే-ఇతరులు
బిచ్చమెత్తినా ఫరవాలేదు.

46

జీవితం అంటే
మొగ్గను ముద్దుపెట్టుకోవడం కాదు
అగ్గిని అరచేత పట్టుకోవడం.

47

ఎత్తుకు ఎదిగితేనే
కొత్త పాఠాలు నేర్వడం
అరలో ముడుచుకుంటే
అస్తమానమూ ఏడ్వడం.

48

తాజ్ మహల్‌ను చూసి దేశంలో
దారిద్ర్యం లేదంటావా!

49

తాజ్‌మహల్‌ను చూస్తే
ప్రణయం పరిమళిస్తుందా?
విదేశాలకు వెళ్ళితే
విజ్ఞానం విరబూస్తుందా?

50

పిల్లలు ఆరోగ్యంగా ఉంటేనే
తల్లి గొప్పతనం
పల్లెలు పచ్చగా ఉంటేనే
ఢిల్లీ గొప్పతనం.

51

ఎన్నెన్ని భాషలు మాట్లాడుకున్నా
తల్లి భాషలా ఉంటుందా!
రంగులెన్ని పూసుకున్నా-సహజ
లావణ్యంలా ఉంటుందా!

52

ఖడ్గశక్తి మెరిస్తే
కదనం.
శబ్దశక్తి విరిస్తే
కవనం.

53

అసత్యరక్షణం కోసం
హత్యలు నిత్యంనేడు
నయనాల వెలుగునార్పేసే
నరకుల లోకం చూడు.

54

వెయ్యిచెప్పినా వేమన్న
విన్నదాలోకం ఏమన్న
తన్నుతాను సవరించుకోకున్న
ఎన్ని చెప్పినా సున్న.

55

లోకంలో అన్నింటా
లోపం ఏర్పడుతున్నది
పూతమెరుగు లతిశయించి
లోతు తగ్గిపోతున్నది.

56

కావలసింది నిద్ర
కనులకు కాదు-
మనసుకు.

57

కళ్లు మూసుకుంటే
నిద్ర పట్టినట్లా?
కలం పట్టుకుంటే
కవిత పల్కినట్లా?

58

ఎక్కడైనా ఎప్పుడైనా మహాత్ముల బ్రతుకులు
ఎగుడుదిగుడులే.
అహర్నిశలూ రకరకాల
అలజడులే.

59

బ్రతుకే ఒక బస్సు ప్రయాణం
ప్రతిరోజూ ఒక స్టేజి
చొరవను బట్టే దొరుకుతుంది
చోటైనా సీటైనా.

60

ఉన్నవాడికి
ఉబ్బరం.
లేనివాడికి
నిబ్బరం.

61

విద్యుత్తు లేని నగరాలు
శోభించవు
వివేకంలేని నరులు
రాణించరు.

62

ముడుచుకున్న గుండెల్లో
మువ్వలు రవళించేనా!
చెరువుల్లో ఎక్కడైనా
దొరికేనా రతనాలు!

63

మంచిమనసు ఎపుడైనా
మారునా!
మణిదీపం ఎన్నడైన
ఆరునా!

64

ఆధునికయుగమ్ములోన
ఆదిమమానవులులేరా!
రాకెట్టుల రాకతోడ
రాతియుగం పోతుందా!

65

జాతకం బాగుంటే
చాతకంలా ఎగిరిపోవచ్చు.

66

నింగిలోని తారకలను
తొంగిచూచు వారెవ్వరు!
నేలపైని తారలనే
నిక్కిచూచువారెగాని.

67

దురాక్రమణ దురాక్రమణ
ఋతువులలో-మానవాళి
బ్రతుకులలో ఈ రోజున.

68

పొట్టకోసమే బ్రతికినచో ఈ
పుట్టెడు కష్టం ఎందుకని?
రొట్టెకోసమే జీవిస్తే-ఈ
నిష్ఠురమంతా దేనికని?

69

మహాకవిత్వం కన్న
మానవత్వం మిన్న.

70

మంచిగుణం ఒకటి చాలు
మనిషి బాగుపడడానికి
చెడ్డగుణం ఒకటిచాలు
జీవి జారిపడడానికి.

71

సెలవుంటేనే మనిషికి
అలసటెక్కువౌను కదా!
అన్ని పనులు చేసేది
ఆదివారమే గదా!

72

గెలవేసిన అరటికే
వెలఎక్కువ కట్టేది.
సరుకుంటేనే మనిషిని
సంఘం తలపెట్టేది.

73

ఉపకారాలే చేసేవాళ్లకు
ఉదయాస్తములని ఉంటాయా!
అహోరాత్రాలు పూచే పూలకు
ముహూర్తమన్నది ఉంటుందా!

74

ముసలితనంలో పడుచుబిడ్డలు
మండుటెండలో మంచుగడ్డలు.

75

నరకమైనా స్వర్గమైనా
నరుడే సృష్టించేది.
ముళ్లకంచెనూ పూలతోటనూ
నీళ్లేకద పెంచేవి.

76

పడిపోయినా ఫరవాలేదు
చెడిపోని బ్రతుకే శ్రీమంతం.

77

మనస్సన్నదొక మహాసముద్రం
మణి మకరాలకు నిలయం
మణులవల్ల ఈ లోకం నాకం
మకరాలవల్ల శోకం.

78

గాంధీ గాడ్సే మానవులే
ఆక్సీజన్ కార్బన్‌డయాక్సైడు వాయువులే
వెలిగించే దొకటి.
మలిపేసే దొకటి.

79

గొడ్డలి జీవితం కన్న
కొమ్మ బ్రతుకు మిన్న
తెగనరికే దానికన్న
చిగురించుటయే మిన్న.

80

తలచుకుంటే సామాన్యజనం
ప్రళయకాల ప్రభంజనం.

81

ప్రవహించని జలమూ
పండని పొలమూ ఉండదు.

82

జంబాలం ఉన్నంతకాలం
జలానికి స్వచ్ఛతరాదు
పేదరికం ఉన్నంతకాలం
సంఘానికి ప్రగతిలేదు.

83

పన్నీటిని పైసల్లో లెక్కించొచ్చు
కన్నీటికి మాత్రం ఖరీదులేదు

84

పదవిలో కూర్చొని
పనిచేయకపోవడం
బంగారు పాత్రతో
విషం త్రాగివేయడం.

85

అందాల శిఖరాలూ
అష్టవికారాలూ
అన్నీ ఈ మనిషిలోనే.

86

ఎవరినీ బాధించకుంటే
ఎవరెస్టు ఎక్కినంత సంతోషం,

87

పదవులిచ్చే వాళ్లెందరో
హృదయమిచ్చేవాళ్లు ఏ కొందరో.

88

డెందాలు రెండూ కలిస్తేనే స్నేహం
అందులో ఒకటి భిన్నిస్తే ద్రోహం.

89

ఊపిరి ఉన్నంతసేపు
చిత్తంలోని చెత్తను
చీపురుతో ఊడ్చేయ్
కంతలు కరిగించి పేద
కన్నీటిని తుడిచెయ్.

90

కత్తి నెత్తురును కళ్లచూస్తుంది
మెత్తనిపువ్వు చిత్తాలను చేరదీస్తుంది.

91

కన్నీళ్లు కార్చవలసింది
సినిమాలను చూస్తూ కాదు
అడుగడుగున అగుపించే
అనాథుల జీవితాలను చూస్తూ.

92

కర్పూరానికున్న త్యాగం
కత్తి కుంటుందా!
కరిగి కాంతి నిచ్చేదొకటి
బ్రతికి ప్రాణం దీసే దొకటి.

93

పరుగెత్తే జీవనదికి
సరిహద్దులు ఉండవులే
మంచిమనిషి కెప్పుడు-ప్ర
పంచమంత ఒకటేలే.

94

నిశ్చలమౌ జలంలోనె
నీరజాలు పూస్తాయి.
ప్రశాంత హృదయంలో రస
వత్కవితలు వెలుస్తాయి.

95

అల్పవస్తువని వీథిని
అశ్రద్ధగ పారేయకు
అరటితొక్కపై కాలిడ
అదే ముప్పు ప్రాణాలకు.

96

బరువు మోయు గాడిదలకు
పరువున్నది సంఘంలో
పనిచేయని బడవలకే
పరువు-బ్రతుకు తెరువు లేదు.

97

గగనాలను చీల్చుకుపోతే
జగజ్జ్యోతులగుపిస్తాయి
ఆర్తిధూర్తులను అణచేస్తే
ఆనందం అగుపిస్తుంది.

98

నగరాన్ని బయటనుండి చూస్తే
నానావిధాల నాదాలు
నాలుగడుగులు లోనికి నడిస్తే
వేలవినోదాలు-అతివేలవిభేదాలు

99

మనిషి ఆడే పేక ముక్కలు
మంచిపాలిటి తోకచుక్కలు.

100

హృదయంలో లేని శాంతి
ఏటికి వెళ్లినా
ఊటీకి వెళ్లినా వస్తుందా!

101

గదికి రంగు వేస్తూనే
ఎదనూ సింగారించు

102

చెట్టునూ పిట్టనూ చూచి
చెంగలించే మనిషి
పొంగిపోయే మనిషి
మనిషిని చూస్తేనే
మండి పడతాడు
ఎందుకు?
గాలిలా సోకితే ఫరవాలేదు గాని
జ్వాలలా తాకితే-
అందుకు.

103
బిచ్చగాడికి పెట్టేవాడే
లక్షాధికారి
పెట్టెలో దాచుకునేవాడే
తుట్టతుదకు బికారి.

104
పడివున్న రాళ్లూ
పారే నీళ్లూ
కంటికి సమానమే అయినా
గుండె కోరేది
రెండోదే.

105
సినీమాయే సర్వం అనుకుంటే
జీవితం గాయపడుతుంది.

106
పచ్చని పల్లెను చూస్తే
విచ్చుకుంటుంది మనస్సు
ఎచ్చులపట్నం చూస్తే
రెచ్చిపోతుంది మనస్సు.

107
గాలంవేసే వాడైనా
కాలానికి ఎఱకాక తప్పదు.

108
ఎవరెత్తు పెరిగితే
హిమాలయానికే పేరు
ఎదలు పెరిగితే
ఈ లోకానికంతా హుషారు.

109
రేకుల ఇళ్లకంటె
ఆకుల ఇళ్లు మేలు.

110

పల్లె కోడి కూసినా
పట్నం రైలు కేకవేసినా
మన కళ్లు తెరవడానికే
మన ఒళ్లు కదలడానికే.

111

వేలప్రజల సౌఖ్యంకోసం
రైలుపట్టాల సంసారం దూరం
అంతా చూచేవారే
కొంతైనా మారకపోవడం ఘోరం.

112

వానకు తడిస్తేనే
దాని గొప్పతనం
కవితకు కదిలితేనే
కావ్యం గొప్పతనం.

113

ఎందరెందరూ ఏమిచదివినా
ఎవ్వరికెన్ని మోటార్లున్నా
ఎక్కడ ఎప్పుడు చిక్కవడేది
ఒక్కడికైనా తెలుసా!

114

కళ్లు తెరచిచూస్తే
ఇల్లే కనిపిస్తుంది
కళ్లు మూసికొనిచూస్తే
ఎల్లలోకం కనిపిస్తుంది.

115

అద్దాలవల్ల అందంవస్తే
అందరూ అందగాళ్లే
చూపుకోసమే సులోచనాలు పెట్టుకుంటే
ఈ లోకంలో చాలామంది గుడ్డివాళ్లే.

116

కిరణానికి మరణంలేదు
హృదయానికి ముదిమే రాదు

117

వంటచేస్తూనే తింటుంటే
వడ్డనకు మిగిలేదేమిటి?

118

హృదయమును ముద్దుగొనుటకై కదలిసాగి
అధరములజూచి అక్కడే ఆగిపోకు
ఎడదపాన్పుపై శయనింప నడచినీవు
కలువకన్నుల గదిముందు నిలచిపోకు.

119

ఉలిదెబ్బలు తింటేనే
శిల శిల్పం అవుతుంది.
బాధల సమ్మెటపోట్లకె
భాష కవిత అవుతుంది

120

ఒత్తుగా పూలు పూయడానికే
కత్తిరింపులు.
మనిషి పూచి ఫలించడానికే
మందలింపులు.

121

పండుకొనుటకై కాదు
పై పంఖా తిరగటం
ఇంకామనం పనిచెయ్యాలనే
పంఖా ఆరాటం.

122

ప్రపంచం దృష్టికి
స్వచ్ఛమైన వాడెప్పుడూ
పిచ్చివాడిగానే కనిపిస్తాడు.

123

మనస్సు మల్లె పువ్వులా ఉంటే
పల్లి కాయలమ్మినా
ఉల్లిపాయలమ్మినా
పరువు తక్కువేం కాదు.

124

'జడ్జీలు' చేసేది
'బ్రిడ్జీలు' చేసేది
జగద్రక్షణం
మనస్సు కరిగినా
మరమ్మత్తు ఒరిగినా
జరిగే నష్టం దారుణం

125

ఈ లోకంలో
గెలువవలసిన న్యాయాలకంటె
గెలువని న్యాయాలే ఎక్కువ
స్టేజీల దగ్గర
ఆగవలసిన బస్సులకంటె
ఆగని బస్సులే ఎక్కువ

126

సిపాయి గుండెనే
తుఫానును ఢీ కొంటుంది.
తూటా ఒక్కటే దొంగతో
పోటీపడుతుంది.

127

కలతలన్ని దాటి మనిషి
కదిలితేనే భవిష్యత్తు
శిశిరమ్మును గడచికదా
చెట్లు మళ్ళి చిగుళ్ళొత్తు

128

ఒక్కొక్కసారి
డొక్కచించుకున్నా
ఒక్కముక్క పెకలదు
కన్నీళ్ళు కార్చినా సరే
కలం ముందుకు కదలదు
ఇది కవుల గతి
రాత్రివెళ్లే రవుల సంగతి.

129

బంగళాలో ఉండే మనిషి
బజారుకు రాక తప్పదు.
ముడుచుకున్న సరోజం
ముగ్ధ మోహనంగా నవ్వకతప్పదు.

130

వనంలోని ఆనందం
భవనంలో ఉంటుందా!
పైరగాలితో వచ్చేహాయి
పంఖాగాడ్పు ఇస్తుందా!

131

పట్టికున్న సంతోషం
లక్షలు పోసినారాదు
నేలపైన నడిచే కాళ్ళు
గాలిలోన కదిలేనా!

132

పెద్దపెద్ద హోటల్లో పెట్టే పైసంతా
ప్లేట్లకూ సీట్లకూ లైట్లకు
కడకు మిగిలేదీ
కడుపులోకి పోయేదీ
కాసంతో కణమంతో.

133

మోటారునుచూచి
స్కూటరు భయపడుతుంది
లారీని చూచి
కారు కంగారుపడుతుంది
ప్రళయసముద్రాన్ని చూచి
ప్రశాంత సరస్సు అదురుతుంది
మోటుబలానికే ఈ లోకం ఎందుకో
మొదటినుండీ బెదురుతున్నది.

134

బట్ట అందమంతా
కట్టడంలోనే
శరీర సౌందర్యమంతా
సౌష్ఠవంలోనే
భాష అందమంతా
పదాల పొందికలోనే

135

భాషరాని పశువుకొక్క
పద్ధతీ నీతీ ఉంది
మాటలాడు మనిషికి ఒక
మాటా మార్గం ఉందా!

136

సాధనచేసే మనిషి
సాధించనిదేమున్నది?
సాధనవలనేగా మరి
'సర్కస్' చేసేది.

137

హక్కులన్నీ ఉద్యోగులకు
చిక్కులన్నీ నిరుద్యోగులకు.

138
యువదశలోనే వృత్తిని
ఉజ్జ్వలతను పొందేది
వసంతమ్ములోనే కద
వనమంతా పూచేది.

139
వయసు ముదిరినా కొద్దీ
వచ్చేదొకటే నిరాశ
పచ్చని ఊహలతేలే
పడుచుతనం ఒక నిషా.

140
అవయవాలు కుళ్లితే
'ఆపరేషన్లు'
హృదయాలు చెడితే
'సెపరేషన్లు'

141
పిల్లల కనడం
ఇళ్లను కొనడం
సంఘానికి సేవలా?
స్వార్థానికి త్రోవలా ?

142
వీథుల్లో లేచిన దుమ్మంతా
సౌధాల్లోకి పోదా?
సంఘంలోని కుళ్లంతా
చదువుల్లోకి రాదా?

143
అడ్వర్టైజ్‌మెంట్లకేం
అన్నింటికీ సమానమే
వచ్చేగిరాకే తెలుపుతుంది
వాస్తవరూపాలు-లోనిలోపాలు.

144

చెప్పరాని మంచి పనులు
చేసిన నినుగూర్చి ఎవరు
చెప్పకొందురోయీ-నీ
తిప్పలు నీకేకాని.

145

మైకుల మైకంలో పడి
నీ కంఠం తగ్గించకు
ప్రచారాల వలయంసార్!
పహారాపహారా హుషార్!

146

సభలలోన చర్చలలో
సాగనిమ్ము నీ గళం
ఏకాంతంలో మ్రోగని
ఎదను మీటి నీ కలం.

147

ప్రపంచమ్ము రోజురోజు
రసమయమై పోతున్నది
మలుపు మలుపు వీథివీథి
మధుశాలలు లేస్తున్నవి.

148

చెత్తపనులు జరిగినట్లు
ఉత్తమ కార్యాలగునా!
బార్లు వెలసినట్లు-మంచి
పరిశ్రమలు వెలసేనా!

149

పరులసుఖముకై బ్రతికేవాడే
పదికాలాలుగ నిలుచునులే
సూర్యచంద్రులను నదీనదమ్ముల
చూచిన సంగతి తెలియునులే

150
నిచ్చెనెక్కుతుంటేనే
అచ్చమైన సంతోషం
శిఖర మందుకుంటే-మరి
ఒకరకమగు సంతాపం

151
అంగానికి పూసుకున్న
అత్తరు ఎన్నాళ్లు?
సారాయిని త్రాగి దూకు
సాహసమెన్నాళ్ళు?

152
నోటుబుక్కులు చెక్కులవుతాయా!
నోటిమాటలు బుక్కులవుతాయా!

153
నగ్న నేత్రాలే
అగ్నిసత్యాలు గ్రహిస్తాయి.

154
కలిసి ఉంటేనే జనం
కలిపి తింటేనే భోజనం

155
వర్తమానయుగజీవులు
వాస్తవాల నమ్మలేరు
భావితరం వారే ఆ
ప్రభావాల తెలిసేది.

156
ఈలోకం ఒక ఇంద్రజాలం
ఏమౌతుందో చెప్పజాలం

157
సప్తస్వరాలు కలిస్తే సంగీతం
సంతోషాలు సంతాపాలు కలిస్తే జీవితం

158
జీవితం వేడి కాఫిలాంటిది
ఆగుతూ తాగుతూ సాగాలి.

159
వృత్తికోసం మత్తకాశిని మురిస్తే
చిత్తమే ఇచ్చిందనుకున్నారు మత్తులు.

160
ఎంగిలి అన్నంఅంటే
ఇష్టపడని మనిషి
ఎంగిలి ఆడది
అందితే మాత్రం ఖుషీ.

161
చేసినతప్పే చేసేవాడు
జీవితమ్ములో ముందుకు పోడు

162
కవితకేం సాగిపోవు చకచక
కాని పేరుపెట్టడంలోనే తికమక

163
ఆవేశం వస్తే మనిషి
అన్నిమరచిపోతాడు
ఆలోచన పురివిప్పిందో
అసలు మొదలు పెడతాడు.

164
నిగ్రహం ఉంటేనే
అగ్రస్థాయికి చేరడం
ఆగ్రహం శ్రుతిమించిందో
అధోగతికి దిగజారడం

165
ప్రతిఊరికీ ప్రధానమంత్రివస్తే
పరిశుభ్రతకేం లోటుంటుంది?

166

సుఖాలకేం బహుముఖాలు
దుఃఖానికి ఒకే ముఖం
అబద్ధాలు రకరకాలు
సత్యానికి ఒకే స్వరూపం

167

ఒక్కొక్కడు అవసరాన్ని బట్టి
ఎక్కే వాహనాన్ని ఎన్నుకోవాలి
ప్రపంచమంతా తిరగాలంటే
బండీ ఎద్దులు పనికొస్తాయా !

168

తరువుకున్న ఆకులన్ని
కిరణాలను తిలకించవు
అవకాశాలన్నవి ఇల
అందరినీ పలికించవు

169

చదువులకేం వెలితిలేదు
హృదయాల్లో వెలుగులేదు.

170

రాకెట్లను చేసే మనిషి
రాకెట్టుగ మారేనా!
నినాదాలు చేసే మనిషి
తన బ్రతుకును మరచేనా!

171

నీళ్లూ రాళ్లూ కలిసి ఉంటాయి నదిలో
కరుణా క్రౌర్యం కలిసిఉండునా హృదిలో

177

రంగం మీద నటిస్తే నాటకం
బ్రతుకులో నటిస్తే బూటకం.

172

సూర్యునికై యత్నిస్తే- ఒక
చుక్కైనా చిక్కకపోదు
అంబుధికై కృషిచేస్తే- మరి
చెంబెడైన దొరుకక పోవు.

173

నల్లబల్ల పైనే తెల
తెల్లచాకుపీసు వ్రాత
విజ్ఞానం వెలుగు చేత
అజ్ఞానం అణచివేత.

174

మల్లె పువ్వుపైన ఉన్న
మచ్చ వెంటనే తెలియును
మసిగుడ్డకు అంటుకున్న
మైల ఎట్లు కనిపించును?

175

అభ్యుదయకామికి మొదట
అమావాస్యచీకట్లు
చిట్టచివరకే కదా
సిరివెన్నెల మేడమెట్లు !

176

పాతబాటలో నడిచే మనిషి
నూతనపథాన్ని వేస్తాడు
కొందరి కృతులను చదివేవాడే
క్రొత్త గ్రంథాలు వ్రాస్తాడు.

178

పండితులందరికీ
బహుమానాలు వస్తాయా!
బహూకృత గ్రంథాలన్నీ
పాండిత్యం ఒలికిస్తాయా!

179
ప్రమిద వెలుగుతుంటేనే
పదిమందీ వస్తారు
చిక్కని చీకట్లు ముసిరితే
ఒక్కడైన వస్తాడా!

180
కష్టాలన్నీ మరచిపోతేనే
కాళ్ళు ముందుకు వేసేది
కటిక చీకట్లు గడచిపోతేనే
కాంతిరేఖలను చూసేది,

181
సంసారమంటే అర్థం
స్వామీ! ఏమనుకున్నావు ?
ఇల్లెడు పనిచేయడం
ఇరవైనాల్గు గంటలు మూల్గడం.

182
సామాన్యుని రెక్కలతో
సంపన్నుని మేడలేచు
పేదరైతు నాగలితో
పెన్నిధులే పూచు.

183
వ్రాసిన ప్రతివాక్యూ
రత్నంలా మెరిసేనా!
ఉరిమిన ప్రతిమేఘం
వర్షం కురిసేనా!

184
పనికిరాని వస్తువు అంటూ
ప్రపంచాన ఉండదులే
పెంటలోని చెత్తచెదారం
పంటపండుటకు ఆధారం.

185
నిలుచున్నా పరుగెత్తినా
నీళ్లు ఉపకారమే చేస్తాయి
పెరిగినా విరిగినా
తరువు లాభాన్నే ఇస్తుంది.

186
చూసేవాడు బాగులేదని
సులభంగా అంటాడు
చేసేవాడు ఆ వస్తువునే
చెమట వడిపి చేస్తాడు.

187
గంటసేపు రసపరవశుడై
కవితను కవి వ్రాసేస్తే
నిమిషంలోనే విమర్శకుడు
నిగ్గుదేల్చి పారేస్తాడు

188
కొంచెం కొంచెం చెక్కుకుపోతే
కొయ్యమంచి బొమ్మవుతుంది
ఒక్కసారి చెక్కేస్తే మరి
తుక్కుతుక్కు అవుతుంది.

189
మడిమడిమడి యని
మిడికేవాడిల
గుడివాకిలి దాటేనా!
పైపై పూజలు
పచరిస్తే మరి
భగవానుని ఎద మీటేనా !

190
హిమగిరి శిఖరమ్మెక్కేవాడు
ఇసుకదిబ్బలను లక్ష్యపెట్టునా!

191

చిరుచిరుజల్లులు కురిసినంత నే
చెరువులు వాగులు నిండి పొంగునా !
కూడుగుడ్డలకు చాలని జీతం
ఏడంత స్తులమేడ లేపునా !
నాలుగుముక్కలు నేర్వనివాడు
నవ్యకావ్యాలు వ్రాసేనా!

192

ఇతరులకోసం బ్రతికేవారు
సుతికలిపే జీవిస్తారు.
పండ్లనుపూలను ఇచ్చేతరువులు
పక్కపక్క జీవిస్తాయి.

193

ఎదలో మథనం జరిపే ఊహాలు
ఎపుడో బయటకు వస్తాయి.
నవ్వాలని తపియించే మొగ్గలు
పువ్వులుగా విరబూస్తాయి
లోలోరగిలే నిప్పుకణాలే
జ్వాలలుగా పైకొస్తాయి.

194

సంఘం ఇచ్చిన సంపద మళ్లీ
సంఘం కోసం ఇవ్వాలి
పుడమిని పుట్టిన చెట్టును జూచి
పుట్టెడు జ్ఞానం నేర్వాలి

195

అంచెడు లడ్డులు తింటేనేం-జీ
ర్ణించుకునే బలముండాలి
నిస్తులపదవులు దొరికినసేం-అవి
నిర్వహించుకొను నేర్పుండాలి.

196
తెలివి అణకువ ఉంటేనే
కలిమి కాపురం నిలిచేది
మేడలజూచుకు మిడిసిపడినచో
నీడకూడ కరువౌతుంది.
విఱ్ఱవీగి సుడిగాలిలో తిరుగ
వెలిగే దీపం మలుగుగదా!

197
పనిలో చొరబడి తీరిక దొరుకక
వారం ఏమని అడిగే మనిషికి
తెలివేలేదని అనుకుంటే మన
తెలివి తక్కువే అవుతుంది.

198
పదవికన్న ఉన్నతమౌ
హృదయాలకు బాధలేదు
చూపులకందని నింగికి
గోపురాల రాపులేదు.

199
చక్కనిజాతకం ఉంటే
కుక్కను కొట్టినట్లు కొట్టినా మనిషి
నక్కను తొక్కివస్తాడు.

200
రాళ్లైనా మింగు మనిషి
రహస్యాలు దాచలేడు.
విలువైన సమయమ్మును స
ద్వినియోగం చేయలేడు.

201
మరపుంటేనే మనిషికి
ప్రకృతి నిత్యనూతనం.

202

నాగరికత పెరిగిన ఈ రోజు
నగ్న నృత్యాలపైనే మోజు
చదువులు చంద్రునిపై కెగసిననూ
హృదయం పశుతను విడనేలేదు.

203

కాలాన్ని సద్వినియోగం చేస్తే
కాసులరాసులిస్తుంది
దుర్వినియోగం చేస్తే
దుమ్మూ ధూళీ పోస్తుంది.

204

మగువ మగువేకాక
మగవానిలో కూడ సగం.

205

గాలి గాలిలో కలిసేదాకా
కాళ్లు సేతు లాడించక తప్పదు
మనిషి మనీషిగ బ్రతుకాలంటే
ఘనకార్యాల్ సాధించక తప్పదు.

206

పండితుడు
కండగల మగవాని వంటివాడు
కవి-ఆత్మబలం ఉన్న
కాంతవంటివాడు.

207

తమలపాకుతో ఎన్నో కలిస్తేనే
తాంబూలం
శబ్దాలతో ఎన్నో కలిస్తేనే
సాహిత్యం.

208

చాంతాడంత రాగంతీ స్తే
సభలో జనముండరు-ఆగు.
గిలిగింతలు పెట్టేలాగా
కలగానం చేస్తే బాగు.

209

చచ్చినట్లు ఉపన్యసి స్తే
వచ్చిన జనముంటారా!
గళంలోన బలమే ఉంటే
స్థలం విడిచికదిలేరా!

210

కలమున్నా కాగితమున్నా
కదిలే ఎద ఉండాలి
కంచమున్న మంచం ఉన్నా
కాళ్ల సేతులుండాలి.

211

ఊహాలకేంమరి అంతో ఇంతో
ఉండునులే ప్రతివాడికి
చేసిన ఊహలు చూసినట్లుగా
చెప్పేవాడే మహాకవి.

212

అడుగడుగున
అజ్ఞానం
అణువణువున
విజ్ఞానం.

213

గడియారాన్ని చేసి అందులో
కాలాన్ని చూసుకుంటాడు జీవుడు
ప్రపంచాన్ని నిర్మించి అందులోని
ప్రాణులతో ఆడుకుంటాడు దేవుడు.

214

వాడవాడలో ఇంటింటా
రేలూ పగలూ రేడియోలూ
ప్రతిగల్లీలో పత్రికలూ
బజారుల్లో బళ్లూ
ఘంటాపథాల్లో గ్రంథాలయాలూ
వెలుతురుకళ్ల ఎలివిజన్లూ
పోలీసు ట్రూపులూ
గాలి స్తంభాలే
దొరకని తరగని
దొంగ ఒక్కడే
మనిషి గుండెలో
మసలే చీకటి

215

జాడ్యానికి విందులేదు
మౌఢ్యానికి మందులేదు.

216

రాకెట్లకు అందనికాలం
సైకిళ్లకు అందేనా!
మహర్షులకు చిక్కని దైవం
మామూలుగ చిక్కేనా.

217

కన్నబిడ్డనెప్పుడు మన
సున్నవాడి కివ్వడం
కవితను రసహృదయమున్న
చెవికే వినిపించడం.

218

పెరుమాళ్లే తింటాడని తెలిసిన
మరునా డన్నంపెడతారా!

219

విద్యుత్తు చాల కావాలంటే
పెద్ద "ట్రాన్సఫార్మర్" ఉండాలి
విషయాలెన్నో తెలియాలంటే
పెద్ద "లైబ్రరీ" ఉండాలి.

220

నీడనిచ్చు చెట్లు మరో
నీడలోన పడియుండవు
ఇచ్చేగుణమొకటె గాని
పుచ్చుకొనరు త్యాగధనులు.

221

పల్లెత్తుమాట పల్కనిచెట్టే
పళ్లు కుమ్మరిస్తుంది.
చేతలతోనే క్రియాశీలి
జ్యోతులు వెలిగిస్తాడు.

222

బట్టమీదే మనస్సుపోతే
అట్టడుగుననే ఉంటావు
పొట్టమీదే దృష్టినిలిపితే
జిట్టైడైనా పెరుగలేవు.

223

ఉన్నవాళ్లైనా లేనివాళ్లైనా
చిన్నవాళ్ళకోసమే బ్రతుకడం
తల్లిదండ్రులకున్నదోలేదో
పిల్లలకనవసరం
పిల్లలు పెరిగి తమకు పెడతారన్నది
తల్లిదండ్రుల కనవసరం

224

జీవితం విద్యుత్తుబల్బులాంటిది
ఫిలమెంటు ఎప్పుడు టప్పుమంటుందో
తెలిసినవాడేలేడు.

225

ప్రకృతిని రెండునిముషాలు చూసి
పరమార్థం గ్రహించవచ్చు
ప్రపంచాన్ని ఎంతసేపుచూసినా
పరిశీలకుని మనస్సు నొచ్చు.

226

పెళ్ళిచేసుకున్నప్పుడు
పిల్లమనస్సు పల్లెలా ఉంటుంది
నలుగురుపిల్లలు కలిగితే పాపం
నగరంలా రగులుతుంది.

227

పాడిపంటలందించే చిన్న
పల్లెయే నిదురపోతుంది
పైసలకై పడిగాపులుగాచే
పట్నానికి అది కరువౌతుంది

228

చెరువునీళ్ళకన్న
చెలిమనీళ్లేనయం
సంద్రంనీళ్ళకన్న
సరస్సునీళ్లేనయం.

229

నీరధిపెద్దదే
నీళ్లుచూస్తేఉప్పు.
మనిషి శ్రీమంతుడే
మనస్సుచూస్తే! త్రుప్పు

230

పదిరూపాయలు ఖర్చుపెట్టి
పదినిముషాలు పోగొట్టుకున్నాను.
తరువాత నిముషంకూడా కొనలేక
తల బద్దలుగొట్టుకున్నాను.

231

ఉపకారంచేసి మరవడం
ఉన్నత హృదయాలగుణం
ఉపకారినే మరవడం
అహంకారుల లక్షణం.

232

మంచినీళ్ళ బావులకంటె
ఉప్పునీళ్ళ బావులే ఎక్కువ
మంచివాళ్ళ సంఖ్యకంటె
వంచకుల ముఠాలే ఎక్కువ.

233

పగలంతా పరిశ్రమతో నా ఒళ్లు వాచేది
రాత్రిమాత్రం నా మనస్సు పూచేది.

234

భూమిని గడ్డపారతో పొడిచినా
భూరిధాన్యమే ఇస్తుంది
కత్తితోపొడిచినాసరే పువ్వు
నెత్తావులనే కుమ్మరిస్తుంది.

235

ఏమీ సాధించలేక నేను
ఎన్నో ఏండ్లను చంపాను
సాధించే శక్తి వెల్లగా
సమయం చాలక చచ్చాను

236

ప్రతికొండనుండి
ప్రభవిస్తుందా జలపాతం
ప్రతిఅడవినుండి
ప్రసరిస్తుందా మలయమారుతం
ప్రతిమనిషినుండి
ప్రవహిస్తుందా మంచితనం
ప్రతిహృదయంనుండి
పరిమళిస్తుందా కవితాసుమం.

237

ముక్కుసూటిగా పోతేనే
ముప్పా?
ఏ ఎండకా గొడుగుపడితే
ఎప్పుడైనా మెప్పా ?

238

గ్లాసెడుపాలను
గటగట తాగేపాప
నీళ్లు కూడా కరువైనప్పుడు
"నిప్పల్" నే చప్పరిస్తుంది:

239

కలోగంజో తాగి
కాలం వెళ్ళబుచ్చే బిచ్చగాళ్ళకు
నిల్వనీడలేనప్పుడు
రైల్వేస్టేషన్లే ఇళ్లు.

240

సామాన్యప్రజలు
చంటిపాపల్లాంటివాళ్లు
నవ్విస్తే నవ్వుతారు
పిడిస్తే ఏడుస్తారు
బెదిరిస్తే అదిరిపడతారు.

241

ప్రయాణికులు ఎంతమందిఉంటేనేం
డ్రైవరు లేనప్పుడు
అనుచరులెందరుంటేనేం
అసలు నాయకుడు లేనప్పుడు

242

వచ్చే పేరంతా
స్వచ్ఛమైనదికాదు
స్వచ్ఛత ఉంటేగాని
వచ్చినపేరు నిలువదు.

243

చేసేపని ఒకటే అయినప్పుడు
చిన్నవాడైతేనేం పెద్దవాడైతేనేం ?
చూపేకాలం ఒకటైతే గడియారం
రూపం ఎలా ఉంటేనేం ?

244

ప్రజాజీవనంలో
నిజాయితి ఎలాఉంటే ముద్దు?
అమ్మేవాళ్ళకు నష్టం రావద్దు
కొనేవాళ్ళకు కష్టం కావద్దు.

245

సాధించాలన్న వాడికే
సవాలతు కష్టాలు.
బోధించాలన్నవాడికే
బోలెడు పుస్తకాలు.

246

మాట్లాడే ప్రతివాడు
మనమిత్రుడుకాదు
చుచ్చేకునే ప్రతివా.డు
శ్రెచ్చవాడు కాదు

247

మనఇంట్లో ఉన్నంతసేపు
మనిషి విలువ తెలియదు
వెలిగేదీపం మలిగినప్పుడే
వెలుగువిలువ తెలిసేది.

248

ఉపవాసం మీదకంటె
ఉపాహారం మీదే మోజు
అనుదినం అన్నంతినే మనిషికి
అట్లుంటేనే మోజు.

249

జిత్తులూ ఎత్తులూ పన్నేవాడు
చిల్లర సంపాదించడం తప్ప
ఎత్తుకు ఎదుగలేడు
కొత్తదారి తొక్కలేడు.

250

సింహాలకెప్పుడూ
సింహద్వారమే
అడ్డమైన గడ్డిగరిచేవాళ్ల కే
దిడ్డిదారి.

251

ప్రగతిశీలి
పరమజడునివద్ధ పడియుండునా
జలపాతం
శిలాప్రాతం వద్ద నిలుచునా!

252

సమయం అందరికీ
సమానమే
ఒకడు భవనం నిర్మిస్తాడు
ఒకడు భస్మం చేస్తాడు.

253

కాగితపు గులాబీలు
గంపెడైన ఏం లాభం?
గడ్డిపువ్వు ఒకటైనా
కణకణమున సౌరభం.

254

వేషాలకేం
పెద్దమనుష్యులే
బుద్ధులు బాగలేకనే యుద్ధాలు

255

ప్రసిద్ధుల కన్నీ
ఫలసిద్ధులే
సాధకులకే
బాధలు.

256

పేరుమోసినవాళ్ల చెత్త రచనా
పేరులేని ఉత్తమరచనా
రెండు పడుతాయి
ఎందులో?—
ఒకటి పత్రికలో,
ఒకటి చెత్త బుట్టలో.

257

పదవిలేకున్నా పనిచేయడం
ఉదాత్తుల గుణం
పదవిలో ఉండి పనిచేయడం
మధ్యముల లక్షణం.
పదవిలో ఉన్నా పనిచేయకపోవడం
అధమాతి అధమం.

258

గడియారం ఆగునట్లు
కాలచక్ర మాగునా!
చిన్ని చిన్ని వాగులవలె
జీవనదులు ఆగునా!

259

సనీమాల కేం
చిత్రవిచిత్రాలే-కాని
తీసేవారికి ప్రసూతివేదన
చూసేవారికి ఆనందచేతన.

260

నాల్కపై సాధించే
పల్కుబడి సుకరం
నలుగురిలో సంపాదించే
పలుకుబడి దుష్కరం.

261

నింగికి రంగులేదు
పసిపాపకు పక్షపాతంలేదు.

262

జేబులు కుట్టేవాళ్ల బాధ
జేబులు కొట్టేవాళ్ల కుంటుందా!
నాల్గు ముక్కలు వ్రాసేవానిబాధ
నకలుగొట్టేవానికుంటుందా!

263

కవిత్వమంటే
కసిని కక్కడం కాదు
మసిని పూయడం కాదు
విషాన్ని సైతం మింగి
అమృతాన్ని అందించడం.

264

అందం కావాలంటే
ఎందరో చెప్పజాలం
డెందమే కావాలంటే
కొందరే కేవలం.

265

పాఠశాలలు నూరు
పాఠం ఒక్కటే
ప్రవక్తలు వేరు
పరమార్థం ఒక్కటే.

266

తనకు తెలియనిది కొంచెమైనా
దట్టమైన చీకటే
కొండంత తెలిసినా-అది
గోరంత వెలుగే.

267

బస్సుడిపోలో కనిపించే
ప్రతిబస్సూ ఎక్కలేం
చౌరస్తాలో కలిసే
దారులన్ని తొక్కలేం
పుస్తకశాలలోని
పుస్తకాలన్నీ చదువలేం
ఎన్ని ఉన్నా మనిషికి
ఎన్నుకునే కన్నుండాలి

268

ప్రయత్నం లేకుండానే వస్తుంది
పరధ్యానం
ఆరాటపడ్డా అందనిది
ఆత్మజ్ఞానం

269

వనం పూచేది ఎందుకో
కవనం విరిసేది అందుకే.

270

చెట్టుపడే అవస్థ
గుట్టుగానే ఉంటుంది
అందంగా పూచేదే
అందరికీ తెలిసేది.

271

సాగయ్యే భూమికన్నా
సాగుకానిదే ఎక్కువ
సద్వినియోగమయ్యే చదువుకన్నా
కాని చదువే ఎక్కువ

272

ఉన్నవాడికి అహంకారం
అలంకారం
లేనివాడికి అదేగుణం
అవమానం

273

దండోరా వాయించుకునేవాడికే
దండవేస్తుంది లోకం!
మౌనంగా పనిచేసేవాడితో
మాటైనా పల్కదు- ఇదేంలోకం!

274

కనిపించే చుక్కలకన్న
కనిపించని చుక్కలే ఎక్కువ
కనిపించే మంచివాళ్ళకన్న
కనిపించని మంచివాళ్ళే ఎక్కువ.

275
చుక్కలను లెక్కిస్తేనే
దక్కుతుంది సన్మానం.
లక్షణంగ తిని పడుకుంటే
లక్ష్యపెట్టునా జనం.

276
చెట్లుంటేనే
పండ్లు.
ప్రజలుంటెనే
పదవులు.

277
బొగ్గుతో రాపిడిపడితేనే- మల్లె
మొగ్గలౌతాయి దంతాలు
అజ్ఞానంతో పోటీపడితేనే
విజ్ఞానకాంతులు చేరుతాయి దిగంతాలు.

278
ఏ భాషలో ఏడ్చినాసరే
ఏడుపు మాత్రం ఒకటే
భాషలు వేరైనా
బాధమాత్రం ఒకటే.

279
ఎగుమతులూ దిగుమతులూ ఉంటేనే
ప్రగతిని పండిస్తుంది దేశం
చదువులూ వ్రాతలూ సాగితేనే
ఎదుగుతుంది భాషాకోశం.

280
పెట్టలేకున్నా
కుట్టిపోతాయి గండుచీమలు
పెట్టుబడి లేకుండానే
బేపారం చేస్తారు దొంగసాములు.

281
శిశువు బ్రతికినా చచ్చినా
ప్రసవవేదన మాత్రం తప్పదు
ప్రయత్నం ఫలించినా ఫలించకున్నా
బాధలు మాత్రం తప్పవు.

282
ఐశ్వర్యం హసించినా
దారిద్ర్యం తాండవించినా
మహానగరాల్లోనే.
మణులైనా
మకరాలైనా
మహాసముద్రాల్లోనే.

283
బీటలువారిన ప్రజల పొలాలకు
పటికాల్వనై ప్రవహిస్తా
ఆకలిచీకటి నంతంచేసే
హర్ష జ్వాలలు పండిస్తా.

284
ఈలోకం ఒక గులాబి
పూలమొక్క నిజంగా
విచ్చేవికొన్ని పూలు
కుచ్చేవి ఎన్నో ముళ్లు.

285
ఏబుతువు బ్రతుకైనా కొన్నాళ్లే
ఏ మనిషి అధికారమైనా కొన్నేళ్లే.

286
ఆదాయం
సందేహాలంకారం
ఖర్చు
స్వభావోక్త్యలంకారం.

287

చౌరస్తాలోనే నిలిచేవాడికి
సందుల సంగతి తెలియదులే
రాజధానిలోనే ఉంటే పల్లెల
ప్రజల గొడవలే తెలియవులే
పుస్తకనామం చూచిన లోపలి
వస్తువివరాలు తెలిసేనా!
పైని శీర్షికలు చదివినంతనే
లోని భావాలు తెలిసేనా!.

288

పసిపాపలు మట్టితో ఆడుకుంటారు
పడుచువాళ్ళు మనసుతో ఆడుకుంటారు
మొదటిది తుదిదాకా మధురం
ఆ తరువాతిరకం అప్పుడప్పుడూ నరకం.

289

శరీరం క్షణభంగురమైతే
అసలుకష్టాలు అందులో ఎన్నోవంతు ?
బ్రతుకే ఒకభారమైతే
బాధలూ వేదనలూ భరించడం ఎలా ?

290

పసిపాపలను
పరిశోధించడం అంటే
భగవంతుణ్ణి
పరీక్షించడం అంతే.

291

కృత్రిమకవులే
శత్రువులు.
సమాజకవులే
స్నేహితులు.

292
చెత్త ఊడ్చేసే వాడిపైనే
చేరునులే దుమ్ము
మంచిచేసేవాడికే
మాటవచ్చుసుమ్మ.
293
పైసలు చేతికిరాకముందే
ప్రతివాడికీ ఒకప్లాను
అసలు చేతికొస్తే
అస్తవ్యస్తమౌను.
294
ప్రతిభకు గతి కల్పిస్తేనే
ప్రగతి.
295
శరంలా చెప్పినా
చంద్రవంకలా చెప్పినా
అంగారంలా చెప్పినా
అరటిపండులా చెప్పినా
నిజమైన కవిఎప్పుడూ
ప్రజలకోసమే చెపుతాడు.
296
కవి తలలో లేనిది
కవితలలో ఎలావస్తుంది ?
నింగిలో లేని నీరు
నేల కెలావస్తుంది ?
297
సూర్యుడు చేసే అనంత సమరం
చూసేవాళ్ళకు అనవసరం
ఇచ్చేవెలుగును పుచ్చుకొనుటయే
ఈ లోకానికి సహజం.

298

ఈ కవితా గంగానది
ఎంతవరకు ప్రవహించును?
మనిషిగుండెపొలంలోన
మణులను పండించువరకు.

299

మన నాగరికత ఎంతగ
మారినదో చూడండి
తలవంచక "నమః" అనీ
పలికినచో చాలండి.

300

చిన్న చిన్న వాటికాశపడేవాడు
శిఖరాలందుకోలేడు.
కమ్మగాలిని కలలుగనేవాడు
కన్నీటివిలువలు గ్రహించలేడు.

301

మిసమిసలాడే మల్లినీ
రుసరుసలాడే ఉల్లినీ
వాసనచూడగలవాడే
సిసలైన రసికుడు.

302

అనుకున్నట్లుగా సాగితే
ఆత్మకు ప్రకాశం రాదు
ఆశాభంగం జరిగినప్పుడే
ఆత్మసింహం పరాక్రమిస్తుంది.

303

ప్రక్క ప్రక్కగా వెళ్ళితే
చిక్కులేవీరావు
ఎదురెదురుగా వస్తేనే
ఎవరికైనా గాయాలు.

304

కవిత్వం అబద్ధమైతే
కవిగా పుట్టడం శాపం
కవిత్వం అబద్ధమే అయితే
ఇంతకాలం ఎలా బ్రతికింది ?

305

నేను వ్రాసే ప్రతి ఖండానికి
నికషోపలం ఏమిటి ?
నిజాన్ని ఎంత అందంగా
నిరూపిస్తాననేదొకటి.

306

'ఏర్ కండిషన్' గదులకు
ఎండా చలీ తెలియదు.
'కండిషన్డ్' మెదళ్లకు
కాంతులూ చీకట్లూ తెలియవు.

307

జాగృతితో నడిస్తే నే
జగత్తులో భవిష్యత్తు
కళ్లు మూసికొని అడుగేస్తే
ఎల్లకాలమూ విపత్తు.

308

చేవ ఉంటేనే జీవనం
హృదయముంటేనే భావనం.

309

తరులకూ ఝరులకూ ఉన్న సేవాశక్తి
నరజాతికి రావాలి
పసిపాపల పసిహృదయం
ప్రతివాడికీ కావాలి.

310

అక్షరాలు లక్షణంగా కుదిరితే
లక్షలకేం లోటు?

311

కల్యాణమూర్తుల చేతలకు
కారణమేముంటుంది?
రేయింబవళ్ళు వెళ్లే చంద్రసూర్యులకు
ప్రేరణ ఏముంది?

312

గుట్టను పగులగొట్టడం కన్న
చెట్టును చిగురింప జేయడం కష్టం
కండబలంతో ఖండించడంకన్న
గుండెతో పండించడం కష్టం.

313

మనిషి పాడితే-పాట
భూమిపాడితే-పూలతోట

314

మనిషి చదివితే
తన తలనిండా తెలివి
భూమి చదివితే
పుష్కలంగా పంటలు.

315

వస్తువును బట్టి
వ్యవహారం.
కమ్మని మామిడి పళ్లకు
కలకండతో సంసారం
పుల్లమామిడి కాయలకు
ఉప్పూ కారం.

316

చెట్టుచిగుళ్ల చూపు
ఆకాశం వైపు
పండిన పళ్ల చూపు
అవనీతలం వైపు.

317

సినీమా పాటైనా
ప్రబంధ పద్యమైనా
పరిమళిస్తేనే
ప్రజల్లో ఉంటుంది.

318

మట్టిమీద కూర్చున్నా
మామిడిపై కూర్చున్నా
పాడేదికోకిలైతే చాలు
పల్లవిస్తుంది మనస్సు
ఎప్పుడైనా ఎక్కడైనా
వెలిగేది దీపమైతే చాలు
ఒలికిస్తుంది తేజస్సు.

319

పదాలు కలిస్తే వాక్యం
స్వాంతాలు కలిస్తే సమైక్యం

320

చిత్రాలు ఎత్తుగా ఉంటే
చిటిచాపలే సింహాసనాలు.

321

పంచభూతాల నెవడైనా
వంచన చేసేనా!
ప్రతిభకు ప్రభువైనా
పగ్గం వేసేనా!

322

విలువ తెలిసికుంటే
తెలివి నిలుపుకుంటే
కలహం రాదు
కలతా రాదు
జాజిపూలకూ
రోజాపూలకూ
జగడాలున్నాయా!
పాటలకూ పద్యాలకూ
పోటీలున్నాయా!

323

చంటివాడికెన్నిచ్చినా
సంతృప్తి తక్కువే
బండెడు వ్రాసినా-మహాకవి
గుండెకెప్పుడూకొరతే.

324

నేలను తన్నితే
కాలే నొస్తుంది
సహనాన్ని తిట్టితే
శబ్దమే చస్తుంది.

325

మహాత్మ ఎప్పుడూ
మంచినే కోరుతుంది.
జ్వాల ఎప్పుడూ
పైకే లేస్తుంది.

326

కోటిపాటలున్నా – పాడే
గొంతుఒకటి ఉండాలి
పదాలెన్ని ఉన్నా - కూర్చే
ప్రతిభ ఒకటి ఉండాలి.

327

వీచేగాలి
హృదయానికి ఊయల
నిలిచేగాలి
నిజంగా వల.

328

మాటరాని మనిషి
ఊటలేనిబావి

329

తూటానుబట్టి
తుపాకివిలువ
మాటనుబట్టి
మనిషికివిలువ

330

గొంతు వికసిస్తే రాగం
స్వాంతం వికసిస్తే త్యాగం

331

పొలమూ జలమూ
విత్తనమూ సత్తువా
ప్రతిఒకటీ కలిస్తేనే పంట
చదువూ సంస్కారమూ
మనసూ వయసూ
అన్నీ కలిస్తేనే ఆలుమగల జంట.

332

మెరిసే మెరపులు ఎందుకు ?
కురిసే మేఘం కావాలి.
వెలిగే శిరసులు ఎందుకు ?
వెలిగించే మనసులు కావాలి.

333

దేశభక్తిలేని పాండిత్యం
సౌశీల్యంలేని సౌందర్యం

334

వేల పొలాలకు నీళ్ళిచ్చినా
విలపించేనా నది!
ఎంతమందికి అన్నం పెట్టినా
చింతిస్తుందా మంచి హృది!

335

కళ్ళు చిన్నగ ఉన్నా
గగనాన్నంతా చూడవా!
వ్యక్తిసన్న గున్నా
శక్తికి మాత్రం కొదవా!

336

ముప్పుతిప్పలను ఎదిరిస్తేనే
గొప్పవాళ్లు కాగలిగేది
గాలిని మిడతను ఎదిరిస్తేనే
జ్వాల ధగధగా వెలిగేది.

337

నిధులున్నా లేకున్నా
విధులను మాత్రం మరవకు
పని అయినా కాకున్నా
పరులకు మాత్రం వెరవకు.

338

చంద్రుని నిందిస్తే ఆతని
అందానికి కొదువుండదు
పరోపకారిని పరాభవిస్తే
జరిగే నష్టం అతనికి కాదు.

339

పెరుగుతున్నది జనాభా
పెరుగుతున్నదా ప్రతిభ?

340

రంగుటద్దాలు మారినా
నింగిమాత్రం ఒకటే
చూపులు వేరైనా వస్తువు
రూపు మాత్రం ఒకటే.

341

విద్యుత్తంతా ఒకటే
వేలవేల రూపాలు
విజ్ఞానమంతా ఒకటే
వేలకొద్ది విభాగాలు.

342

ఉపకారుల మరచే మనిషి
అపకారుల మాత్రం మరవడు
ఓట్లిచ్చినవారి మరచినా
ఓట్లివ్వని వారిని మరవడు.

343

మంచుకొండ ఎక్కితేనే
మానససరస్సు చూసేది
మనస్సు ఎదిగితేనే
మనోహరంగా వ్రాసేది.

344

ఎల్లదేశాల మొక్కలు తెచ్చి
తల్లితోటలో నాటుతా
సౌందర్యం సౌగంధ్యం కోసం
సరిహద్దులన్ని దాటుతా.

345

నరులకన్న అందంగా
నదీతరువులు నవ్వుతాయి.
నది నవ్వుతుంది.
ఎలా?
నురుగులా;
తరువు నవ్వుతుంది
ఎలా?
విరిలా;

346

పొగరేపే సిగరేటు
పొగసైన అలవాటు
గుండెల్లో పొడిచినా
గుర్తురాని పోటు.

347

సెలవైనా అలసమైనా
మామూలు మనుషులకే
మహాత్ముల కెక్కడిది?

348

రాకాసులకేం?
కేకవేస్తే చాలు
కోకొల్లలు.
దేవులాటంతా
దేవతలకోసమే.

349

నీరుంటేనే ఏరూ
ఏరుంటేనే తీరాలూ
జనముంటేనే సమాజం
సమాజముంటేనే శాసనాలూ

350

పాపలకూ
పాపులకూ
పరమానందం పాట.
చీకటితో
వెలుతురుతో
పలికే అమృతం పాప.

351

మాయలోకం
మనస్సు తెలియక
మనిషి పిచ్చెక్కిపోతాడు
మల్లెమనస్సులు
కళ్ల కద్దుకుంటే
మళ్లీ మనిషి అవుతాడు.

352

నరకంలో స్వర్గం
దారిద్ర్యంలో దాంపత్యం.

353

రాళ్లూ నీళ్లూ
ఇసుకా ఇటుకా
కట్టే మట్టీ
కలిసిపోతేనే భవనం.
పదాలూ భావాలూ
ధన్యాలంకారాలూ
అన్యోన్యంగా ఉంటేనే కవనం.

354

నీరుపారితే బంగారం
మనిషి ఎదిగితే సింగారం.

355

శతాబ్దాలు గడిచినా
శతాంశమైనా వాడనిపూలు-కావ్యాలు.

356

కలకాలం
కమ్మగా ఉండే రసం-కావ్యరసం.

357

పేదరికానికి మతంలేదు
మంచి తనానికి మితంలేదు.

358

బిచ్చగాడికి- ఇచ్చేవాడే శ్రీమంతుడు
విద్యార్థికి- వివేకాన్నిచ్చేవాడే గురుడు.

359

ఏ అడుగు వేసినా
ఏ నుడుగు వ్రాసినా
ప్రతిమొక్కా పెరగాలనే
ప్రతిమొగ్గా విరియాలనే.

360

గుడులున్నా లేకున్నా
గుడిసెలు మాత్రం ఉండొద్దు
దైవమున్నా లేకున్నా
దారిద్ర్యం ఉండొద్దు.

361

ఎప్పుడెగురునో ఈ ప్రాణం
చెప్పునకానీ నిర్మాణం
ఎన్నడు పడునో ఈ దేహం
ఇప్పుడె వెల్గించు ఆరని దీపం.

362

సంఘానికి మనమిచ్చే- సంపద ఏముంటుంది?
సౌజన్యం సౌహార్దం- సంస్కారం సహకారం.

# పుస్తక పంపిణీ - పథకం

యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమాన్ని ప్రోత్సహించండి !

మీ తీరిక సమయాన్ని సాహితీ ఉపాసనా సమయంగా రూపొందించండి!!

యువభారతి ప్రచురణలను కొని చదవండి, కొనిపించండి ! !

లక్ష తెలుగిళ్ళలో భాగవత పరిమళాలు గుబాళించాలనే సంకల్పంతో "మందార మకరందాలు" వెలువరించింది యువభారతి. నేటికి దాదాపు 40 వేల ప్రతులు అందించగలిగింది. లక్ష ప్రతుల లక్ష్యసాధనలో యువభారతి మీ తోడ్పాటు నర్థిస్తోంది. మీద్వారా కనీసం పది తెలుగిళ్ళలోనైనా 'మందారమక రందాలు' చోటుచేసుకొనేలా చూడండని విన్నపం. మందార మకరందాలనే కాదు- వేమన్న వేదంలాంటి ఇతర ప్రచురణలన్నిటినీ అందించేందుకు - అవకాశం కల్పి స్తున్నదే పుస్తక పంపిణీ పథకం.

మీకు లాభాన్ని, మాకు తృప్తినీ పంచేలా,
అందరకూ యువభారతి పుస్తకాలు అందించేలా
రూపం దిద్దుకొన్న ప్రత్యేక అవకాశం.
మీరు చేయవలసిందల్లా—
కేవలం రూ. 25.00 లు, మీ పేరు, చిరునామాలతో,
యువభారతికి డిపాజిట్టుగా పంపడం, వెంటనే
రూ. 50/- ల విలువగల యువభారతి పుస్తకాలు (మీరు కోరుకున్నవి) మీకు రిజిష్టర్డు పోష్టులో అందుతాయి.
ఆ వెనువెంటనే—
మీ నలుగురు మిత్రులకూ వాటిని చక చకా అందచేసి, ఆ వచ్చిన మొత్తంలో రు. 15.00 లు మీ స్వంతానికి అట్టేపెట్టుకొని, కేవలం రు. 35/- లు మాత్రమే- యువభారతికి పంపాలి.
మీ నుండి రూ. 35.00 లు అందిన వెంటనే—

మీరు కోరుకున్న మరో రు. 50.00 ల పుస్తకాలు మీకు పంపుతాము. ఇలా నిరంతరంగా "సొంతలాభం కొంత" చూసుకుంటూ ఇటు సంస్థకూ, అటు సాహిత్య ప్రయోజనాలకూ తోడ్పడవచ్చు.

ఈ క్రొత్త పథకం వివరాలను మీ మిత్రులకూ చెప్పండి !

యువభారతి వెలిగించిన చిన్న దీపం కాంతులను పదికాలాల పాటు పరి రక్షించేందుకు మనసారా తోడ్పడండి ! !

---

యువభారతి, 5. కింగ్స్‌వే. సికింద్రాబాదు-3.

## అందుబాటులోనున్న - సాహితీవాహినితరంగాలు

| | | | |
|---|---|---|---|
| 1. మందారమకరందాలు | 2-00 | 2. ప్రజాసూక్తం | 2-00 |
| 3. వికాసలహరి | 2-00 | 4. వేమన్నవేదం | 2-00 |
| 5. వడగళ్ళు | 2-00 | 6. నా గొడవ | 2-00 |
| 7. శ్రీనాథుని కవితావైభవం | 2-00 | 8. విశ్వనాథకవితా వైభవం | 2-00 |
| 9. శిఖరాలూ—లోయలూ | 2-00 | 10. భావన | 2-00 |
| 11. మెరుపులు | 2-00 | 12. తిక్కన కవితావైభవం | 2-00 |
| 13. చేమకూర కవితావైవం | 2-00 | 14. చలం ఆలోచనలు | 2-00 |
| 15. భారతీవైభవం | 2-00 | 16. తిమ్మన కవితా వైభవం | 2-00 |
| 17. ధూర్జటి కవితావైభవం | 2-00 | 18. తులసీదాసుకవితా ,, | 2-00 |
| 19. నన్నయ కవితావైవభం | 2-00 | 20. ధర్మపథం | 2-00 |
| 21. శతక సౌరభం | 2-00 | 22. నన్నెచోడ కవితావైభవం | 2-00 |
| 23. కాళిదాసు కవితావైభవం | | 24. సూరదాసు కవితావైభవం | 2-00 |
| 25. తిరుపతి వేంకటకవుల కవితావైభవం | | 26. గోరాశాస్త్రీయం | 2-00 |
| 27. కిరణాలు—కెరటాలు | | 28. సాహిత్యాధ్యయనం. | 2-00 |




తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంది పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

**యువభారతి**

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# నందిని




## మీ ఆత్మీయులతో ఆనందం పంచుకోండి
## ఒక్క రూపాయికే నందిని నందుకోండి

కేవలం ఒక్క రూపాయితో – భారత దేశంలో మీ ఆత్మీయులు ఎక్కడున్నా సరే – సంవత్సరం పాటు వాళ్ళు మిమ్మల్ని గుర్తుంచుకునేలా – మీ ఆత్మీయతకు కొత్త అనుబంధాన్ని పెనవేస్తూ – యువభారతిని వారికి పరిచయం చేసినందుకు మిమ్మల్ని అభినందించేలా చేస్తూ – పన్నెండు నెలలూ మీ ఆత్మీయుల్ని పలకరిస్తుంది 'నందిని' అటు అందుకున్నవారికి ఆనందాన్నీ, ఇటు అందిస్తున్న మీకు సంతృప్తినీ సమానంగా పంచిపెడ్తుంది – 'నందిని'

**మీరు ఎన్నైనా రూపాయలు పంపవచ్చు**

**అన్ని చిరునామాలూ పంపాలని గుర్తుంచుకోండి!**

ఉత్తర ప్రత్యుత్తరాలకు –

**యువభారతి**

5 కింగ్స్‌వే, సికిందరాబాదు, 500003

స్వయంగా వచ్చి కలవదలిస్తే : యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనాలు,
తిలక్ రోడ్డు, హైదరాబాదు, 500001



చుట్టూరా
ఆవరించుకునివున్న చీకటిని
తిట్టుకుంటూ కూర్చోవడంకంటె
ప్రయత్నించి
ఎంత చిన్నదీపాన్నయినా
వెలిగించడం మంచిది
అన్నవాక్యమే మా యువభారతికి ఊపిరి